# మంజీర నాదాలు

రచన

డా॥ వాసా ప్రభావతి

వాసా ప్రచురణలు
మలక్‌పేట, హైదరాబాదు.

MANGEERA NADALU
BY
Dr. VASAA PRABHAVATI

First Edition June 1993

ముఖచిత్రం : శీలా వీర్రాజు గారు

వెల : రూ. 20

ప్రతులకు :

వి. వి. యస్. ప్రకాశ్,
వాసా నిలయం, 11/2RT, మున్సిపల్ కాలనీ,
మలక్‌పేట్, హైదరాబాదు-36.

విశాలాంధ్ర బుక్ హౌస్
విజ్ఞాన భవనం, బ్యాంక్ స్ట్రీట్ కోఠి,
హైదరాబాదు.

నవోదయ బుక్ హౌస్
సుల్తాన్ బజార్, (ఆర్యసమాజ్ మందిరమునకు ఎదురుగా)
హైదరాబాదు.

నవయుగ బుక్ హౌస్
సుల్తాన్ బజార్, హైదరాబాదు.

ముద్రణ :
శ్రీబాలజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాదు-20.

# అంకితం

ఏ దేశమేగినా ! ఎందునివసిస్తున్నా
తెలుగు మాట తీపిదనాన్ని నిలుపుతూ
తెలుగు నుడికారపు సోయగాన్ని పెంచుతూ-
తెలుగుదేశపు తోటలో విరబూసిన జనులందరు
ఒక్కటేనని, ప్రపంచ సమైక్యతకు
తెనుగువారు ఎగురవేసిన జెండాలని చాటి
చెప్పే తానా మహిళామణులకు
కానుకగా ఈ మంజీరనాదాలు కావ్యమును
సమర్పిస్తున్నాను.

వాసా ప్రభావతి

# నా మాట

అప్పుడప్పుడు నాలో కలిగిన స్పందనే ఈ మంజీర నాదాలు. చందోబద్ధమైనదే కవిత్వమని కొందరు వచన కవిత్వమే కవిత్వమని కొందరు అంటారు. కాని పద్యమైన, గేయమైన హృదయాన్ని అలరించేదే కవిత్వమని నేననుకుంటాను. కవి కలము ఎంతవరకు ఆ విషయంలో సఫలీకృతమవుతుందో పాఠకులే నిర్ణయించాలి.

నా చుట్టూ ఉన్న జనుల సమస్యలు, కష్టాలు, కన్నీర్లు నా హృదయాన్ని తాకుతూ ఉంటాయి. అలాగే వారి ఆనందము నన్ను కదిలిస్తుంది. సమాజములోని స్త్రీల సమస్యలను గురించి ఆలోచించినప్పుడు, వారి కష్టాలను, కన్నీళ్ళను గురించి తెలుసుకున్నప్పుడు నాలో కలిగిన మనోభావాలే ఈ కవితా రూపాలు.

అనాది నుండి స్త్రీలు ఎన్నో సమస్యలను ఎదుర్కొంటు వస్తూనే ఉన్నారు. అలాగే యుగానికి ఒకమహిళ చొప్పున ప్రతిభాశాలురు ఉదయిస్తూనే ఉన్నారు. పురాణ కథల్లోని స్త్రీలు కల్పితాలు అనుకోవచ్చు. కాని అవికూడా కావ్య కథలేఅనుకున్నప్పుడు-కొన్ని పాత్రలను గురించి తెలుసుకోవలసిన అవసరం, ఆ పాత్రల వ్యక్తిత్వాన్ని గురించి ఆలోచించవలసిన అవసరం

ఉంది. నిరుత్సాహంతో అలమటించె స్త్రీలకు వారి చరిత్రే ఔష ధంగా, పనిచేస్తుంది. ఆదర్శంగా ఉత్తేజాన్ని కలిగిస్తుంది. అలాగే రాణి రుద్రమదేవి, ఝాన్సీరాణి వంటి నాయికామణులు ప్రపంచా నికే ఆదర్శ నాయికలు. వారి చరిత్రను స్త్రీలందరు తెలుసు కోవాలి.

ఈనాటి యువతికి, యువకునకు గుణగణాలలో తేడాయే కనపడదు. అన్నిరంగాల్లో యువతి ముందంజ వేస్తోంది. అయినా ఒక వర్గం స్త్రీలు ఇంకా వెనకబడే ఉన్నారు. కొన్ని కుటుంబాల్లో స్త్రీలు బాధలు పడుతూనే ఉన్నారు. చదువుకున్న ఉద్యోగాలు చేస్తున్నవారికి మనోధైర్యం కావాలి. తమ సమ స్యను తాము పరిష్కరించుకునే శక్తిని పొందాలి. హృదయ సంస్కారాన్ని పెంపొందించుకోవాలి. ఇవన్నీ నా ఆశలు. నా కోరికలు. అందుకే వాటిని కవితారూపంలో కాగితం మీద చిత్రించాను. అప్పుడప్పుడు రాసుకున్న కవితలన్నిటిని కూర్చి కవితా సంపుటిగా మీముందు ఉంచుతున్నాను. లోకంలో అమ్మ స్థానం అమ్మదే. కవితల్లో నేను అమ్మే. పాఠక లోకం చదవాలని అందరికి అర్థమయ్యే భాషకోసమే ప్రయత్నిం చాను. అక్కడ కూడ దోషాలు దొర్లవచ్చు. కవితారూపం కఠినంగాను తోచవచ్చు. కుల, మతాలకు అతీతమైనది మానవలోకం. అటువంటి విశాల ప్రపంచంలో స్త్రీ పురుషుల భేద మెక్కడా? ఒక్కొక్కప్పుడు అనుకున్న భావాన్ని

కవితా రూపంలో అందించలేకపోవచ్చు. విమర్శకులకు, పండి తులకు, నా అభిమాన పాఠకలోకానికి వందనాలు.

మంజీరనాదాలు కవితా రూపంలో వెలువడడానికి అంద మైన కవరు పేజీ వేయడమే కాకుండా ఎన్నో సలహాలు ఇచ్చిన శీలా వీర్రాజు గారికి నా వందనాలు. సకాలంలో పుస్తకాన్ని అందంగా ప్రింటు చేసి అందించిన శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి నా కృతజ్ఞతలు.

రచయిత్రి

# మంజీర నాదాలు

రంగు రూపు తేడాలు తెలియక
ప్రేమను రంగరించిపోసే మాతృమూర్తిని నేను
దేశ సమైక్యతా రథానికి
ఎగురవేసిన జెండాను నేను.

  

పసుపుపారాణి ఆరని వధువుల
కన్నీటి జాలుకు సేతువును నేను.
వరకట్న దురాచారాన్ని రూపుమాపె
వరద గోదావరిని నేను.

తాళికట్టిన చేతితో ఉరితాడు బిగించె
నరరూప రాక్షసవరుని చేతికి బేడీని నేను.
వరకట్న దురాశాపరుల పాలిటి
బందిఖానాను నేను.

  

మంచిచెడుల భేదాలు చూపక
చల్లగా పెంచె కన్నతల్లిని నేను.
స్వతంత్ర భారతావనికి
శాంతి కపోతాన్ని నేను.

తప్పటడుగులు వేసె పసిపాపలను
మహాత్ములుగా తీర్చిదిద్దె శిక్షణాలయాన్ని నేను.
పిల్లలందరికి విద్యాబుద్ధులు నేర్పే
గురువులకే ఆది గురువును నేను.

  

పిల్లా పెద్దా భేదాలు చూపక
అందరిని ఏకబాటలో నడిపే యంత్రాన్ని నేను.
గృహాల నిలయమైన
ఈ దేశానికే చుక్కానిని నేను.

ఒక యింటిలో పుట్టి పెరుగుతున్నా
సమాజంలో సంచరించె సభ్యురాలిని నేను.
ఈ స్వేచ్ఛా భారతవనిలో
స్వతంత్ర పౌరురాలిని నేను.

  

ఈ ప్రకృతి అంతా పరచుకున్న
పచ్చని రూపాన్ని నేను.
ప్రకృతిలో ప్రధానమైన
సృష్టికే మూలరూపాన్ని నేను.

లోకానికి విజ్ఞానాన్ని అందించె
రసవత్ కావ్య స్వరూపాన్ని నేను.
తరతరాల జ్ఞాన జ్యోతిని ఉగ్గుపాలతో
అందించే వేదసారాన్ని నేను.

  

అన్ని కాలాల్లో విరబూసె
గృహ లతాంగిని నేను.
అందరి సుఖాలు కోరుకునే
విశ్వ కళ్యాణిని నేను.

కష్టాలను సుఖాలను కళ్ళలో
దాచుకునే స్త్రీమూర్తిని నేను.
ఈ దేశానికే ఆదర్శమైన
సహనమూర్తిని నేను.

  

మగడు కొట్టినా తిట్టినా గడపదాటని
ఇంటి మహాలక్ష్మిని నేను.
కష్ట నష్టాల గోప్యానికై
నా చరిత్రనే పారేసుకున్న ఆడదాన్ని నేను.

చాకిరీతో అరిగిపోతున్నా
సాధింపులతో నలిగిపోతున్నా
కర్తవ్యాన్ని బోధించే కావ్యాన్ని నేను.
మహాభారతంలో గీతను నేను.

  

పిల్లలను బుజ్జగించి
నవ్వించే దాదిని నేను.
ఈ లోకాన్ని ఆదరించే
ఆకాశ స్వరూపాన్ని నేను.

గుండెల్లో బాధల బాకులు పొడుస్తున్నా
చల్లగా పలకరించె శారదరాత్రిని నేను.
జలజల వర్షించి నేలను చల్లబరిచే
శ్రావణ మేఘాన్ని నేను.

  

చుట్టూ మురికి కంపులు కొడుతున్నా
పరిమళించె కస్తూరిని నేను.
సమాజపు దుర్గాంధాల మధ్యలో
గుబాళించె మంచి గంధపు వృక్షాన్ని నేను.

అక్రమాల వలలో పరితపించే
స్త్రీలపాలిటి రక్షక కవచాన్ని నేను.
కష్టాల పెను చీకటిలో
కొట్టు మిట్లాడేవారికి కరదీపాన్ని నేను.

  

బద్ధకం ఎరుగని స్త్రీలకు
కోడి కూతను నేను.
నిద్రించే లోకాన్ని తట్టిలేపే
వెలుగు రేఖను నేను.

దురాచారాల అడక త్రెరలో
నలిగిన వారికి అమృతాంజనాన్ని నేను.
అజ్ఞానుల కళ్ళు తెరపించె
విజ్ఞాన సూత్రాన్ని నేను.

  

అలసట యెరుగక పనిచేసె
సహన మూర్తిని నేను.
అవమానించి అణగదొక్కితే
దహించే కాలాగ్నిని నేను.

ఆదరిస్తే విరబూసె లతాంగిని నేను.
అవమానించి వంట ఇంట బంధిస్తే
తోక తొక్కిన తాచులా
కాటు వేసే కాలనాగును నేను.

  

కాంతను చూడగానే కన్నుగీటె
కామాంధులకు కారుచిచ్చును నేను.
ఆడవారంటె ఆట బొమ్మలనుకునే
వారికి తోకచుక్కను నేను.

సంసారసాగరంలో జీవితాంతం
మునిగి తేలె ఆట బొమ్మను నేను.
అందరి ఆటను కట్టించే
ప్రచండ శాసనాన్ని నేను.

  

కడుపున ఆడపిల్లని తెలియగానె
కడుపులు తీయించె పెద్దలకు కొరడా దెబ్బను నేను.
దురాచారాల దుమ్ము దులిపె
తుపాకి గుండును నేను.

నుదిటి రాతలను తప్పించుకున్న
కలియుగ కలికిని నేను.
ప్రగతి బాటలను పరచుకున్న
ఆధునిక యువతిని నేను.

  

ఆడదాని శీలాన్ని హరించె
క్రూరులకు సింహనాదాన్ని నేను.
స్త్రీలను అవమానించె మానవ
గమనానికి ఇనుప తెరను నేను.

ఆడవారిని హింసించె
మరహంకారులకు దుస్స్వప్నాన్ని నేను.
మానభంగాలు చేసె
కామాంధులకు కారుచిచ్చును నేను.

  

భార్యను మోసంచేసె
భర్తను శిక్షించె చట్టాన్ని నేను.
అదుపుకాని అహంకారుల పాలిటి
కఠిన కారాగార శిక్షను నేను.

తప్పటడుగులు వేసె
తనయులకు హితవు చెప్పె మిత్రలాభాన్ని నేను.
నీతిని బోధించుటలో
నీతి చంద్రికను నేను.

  

ఇల్లాలిని కొట్టె చేతికి
ఇనుప బంధాన్ని నేను.
భార్యను తిట్టే నోటికి
పక్షవాతాన్ని నేను.

ఆడవారిని చీదరించె
ఛాందసులకు చంప దెబ్బను నేను.
కాలదోషాన్ని కడిగివేసె
గంగా ప్రవాహాన్ని నేను.

  

ఆడవారి ముఖంలో చిరునవ్వులు
చిందాలని తపించే తపశ్శాలినిని నేను.
అదినెరవేరె వరకు పట్టువీడని
పార్వతీ తపస్సును నేను.

క్రూరమృగాల వలలో నిద్రించె స్త్రీలను
తట్టిలేపె వేగుచుక్కను నేను.
బాధల పంచలో నిద్రలేని స్త్రీలను
జోకొట్టె జోల పాటను నేను.

  

ఆడపిల్ల యింటికి మహాలక్ష్మి
అన్నమాట నిజయ్యే వరకు
పోరాటం సలిపే ఉద్యమాన్ని నేను.
భారత స్వాతంత్ర్య సమరగీతాన్ని నేను.

పస్తుండైన పిల్లల కడుపునింపె
భారతీయ మహిళను నేను.
పిల్లలను పెంచడంలో
ప్రపంచ దేశాలకే ఆదర్శాన్ని నేను.

  

మహిళలే దేశ ప్రగతికి మూల స్తంభాలని
పాటుపడేవారికి వెన్నెముకను నేను.
మహిళాభ్యుదయమే దేశాభ్యుదయమని
కృషిచేసే వారికి తోడునీడను నేను.

స్త్రీ ప్రగతికి ఆవరోధాలు కల్పించె
పెనుమేఘాలకు సుడిగాలిని నేను.
ప్రగతిబాటలో విషం కక్కే
కాలనాగులకు గరుడ పక్షిని నేను.

  

అందమైన ఆమ్మాయిల మెడలో తాళికట్టి
అనుమానంతో పీడించె రోగులకు టీకాను నేను.
కళాకారిణులను చేపట్టి వంటగదిలో బంధించె
సంకుచితులకు సర్జరీని నేను.

అన్ని కాలాలలో విరబూసిన
వసంత లతను నేను.
లోకానికి ఆనందాన్ని పంచె
వసంత కోకిలను నేను.

  

ప్రకృతిలో పెరిగె మానవులలో
ప్రధాన పాత్రను నేను.
సంసార సాగరాన్ని మధించుటలో
మంథర పర్వతాన్ని నేను.

ప్రేమ! ప్రేమ! అంటు కన్యల వెంటపడే
భల్లూకాలకు మండె కాగడాను నేను.
ఆడ పిల్లలపై అఘాయిత్యాలు చేసె
మత్తేభాలకు అంకుశాన్ని నేను.

  

ఆడువారి అభ్యుదయాన్ని చూసి
అసూయపడే కళ్ళకు ముల్లును నేను.
న్యాయానికి తప్ప దేనికి
తలవంచని ధర్మ దేవతను.

ముత్యాల పల్లకిలో ఊరేగుతూ
మురిసిపోయే వధువుకు భవిష్యత్తు వాణిని నేను.
సొంత కాళ్ళపై నిలబడి నిజాన్ని తెలుసుకోమని
తెలియ చెప్పె విజ్ఞాన నేత్రాన్ని నేను.

  

కలలు కనే కన్నె పిల్లలకు
నిజాన్ని తెలియచెప్పె అనుభవాన్ని నేను.
మూసిన కళ్ళను తెరిపించె
లోకజ్ఞానాన్ని నేను.

కట్నం కట్నం అంటు పెద్దల వెంట తిరిగె
తనయులకు కొరడా దెబ్బను నేను.
కట్నం ఇచ్చుకోలేని తల్లిదండ్రులకు
అండగా నిలిచె సంస్కర్తను నేను.

  

అశుభంశుభం తెలియని ఆడు వారికి
లోకంపోకడ చెప్పె నీతి శతకాన్ని నేను.
మంచి చెడుల తారతమ్యాన్ని
విప్పి చెప్పె ఉపనిషత్తును నేను.

పలకా బలపం పట్టని ఆడు వారికి
అక్షరాలు నెర్పే వీధి బడిని నేను.
కష్టపడి చదివే సరస్వతులకు
విశ్వవిద్యాలయాన్ని నేను.

  

ఆడు వారికి చదువు లెందుకని
ఈసడించె వారికి కంటిలో నలుసును నేను.
చదువురాదని అవమానించిన
వారికి చెప్పులో రాయిని నేను.

పరులమాటలకు విలువనిచ్చి
సొంత భార్యను త్రోసిపుచ్చె
అమాయకులను మేలుకొలిపే బాకాను నేను.
అందరి మేలునుకోరె చంద్రబింబాన్ని నేను.

  

అత్తాకోడళ్ళను రెచ్చగొట్టె వారిని
మందలించె మిత్రమండలిని నేను.
పనికిరాని పనులు చేసే వారికి
హితవు చెప్పె పురాణాన్ని నేను.

చదువు వంటబట్టించుకుని
విజ్ఞానాన్ని విరజిమ్మె కావ్యాన్ని నేను.
అజ్ఞానాన్ని పారదోలె
పుస్తక భాండాగారాన్ని నేను.

  

కోడలు తలవంచితే
పాదాలు మోపె అత్తలకు శాపాన్ని నేను.
అత్త ఆట పట్టించె
తెలివి నేర్చిన కోడల్ని నేను.

వధువులను పసువుల్లా ఎంచుకునే
దురాచారానికి అంతరాయాన్ని నేను.
కట్నమే ముఖ్యమని గుమ్మాలు
ఎక్కిదిగే వారికి దుఃశకునాన్ని నేను.

  

మూఢాచారాల ముసుగులో
కన్నకూతుళ్ళను అమ్మ చూపే
తల్లిదండ్రులకు అంజనాన్ని నేను.
ఆడ పిల్లల పాలిటి ఇంద్రధనుస్సును నేను.

వయసు వచ్చిన ముద్దబంతులను
చూడలేక కళ్ళుకుట్టి అభాండాలు వేసె
నాలుకలకు చేదు విషాన్ని నేను.
అల్లర్లు చేసె నోరులకు తీవ్రదాహాన్ని నేను.

  

ఆడ పిల్లలను వెంబడించె
రోడ్డు రోమియోలకు జైలు గదిని నేను.
దారులుకాసె రౌడీలకు
లేడీ పోలీసు ఆఫీసర్ని నేను.

మేకవన్నె పులుల పంచలో నిద్రించె
అమాయక స్త్రీలకు వేగుచుక్కను నేను.
బాధల పంచలో నిద్రరాని స్త్రీలకు
బాధలను మరపించె జోల పాటను నేను.

  

ఈ సృష్టిలో తీయని
పిలుపును నేను.
అందరి హృదయాలను
అలరించె కమ్మని గీతాన్ని నేను.

అబలలను అధిక్షేపించిన వారికి
అర్థంకాని రూపాన్ని నేను.
అంతరిక్షంలో అడుగుపెట్టి
గ్రహాలను పట్టిచూపె జ్ఞానశక్తిని నేను.

  

భౌతిక వాదానికి నిలచె
గృహశక్తిని నేను.
ఆంతరంగిక స్వరూపాన్ని
కొలిచె విశాల హృదయాన్ని నేను.

ప్రతి పౌరుని ఉనికికి
ఆధారమైన మట్టి నేలను నేను.
ప్రతి పౌరుని అభ్యుదయానికి
ఆధారమైన జన్మ భూమిని నేను.

  

ప్రతి శిశువు ఉదయించగానె
ఒడినిపట్టె తల్లిని నేను.
తల్లులకే తల్లియైన
నేల తల్లిని నేను.

ఈ సృష్టిలో ప్రధాన జీవరాశిలో
అల్పజీవిని నేను.
ఈ సృష్టికై ప్రాణాలకు తెగించె
ప్రధాన పాత్రను నేను.

  

పిల్లా పెద్దా తేడా లేక అందరి నోటిని
తీపిచేసె చిన్న మాటను నేను.
అన్ని మాటలకన్న మొదట పలికే
గొప్ప మాట అమ్మను నేను.

అందరు ప్రేమించె
అపురూప రూపాన్ని నేను.
ఎవరు కాదనలేని
అసాధారణ అమ్మ రూపాన్ని నేను.

  

ఏ భయమెరుగక
అభయమిచ్చె అమ్మ వడిని నేను.
ఏ చదలు పట్టని
అమ్మ హృదయ రాగాన్ని నేను.

ఇంటిపనికి అంకితమైన
ఇల్లాలిని నేను.
రోగ మొచ్చినా లీవు ఎరుగని
సేవా మూర్తిని నేను.

  

ఎంత పనిచేసినా
జీతభత్యాలు అడుగని త్యాగమూర్తిని నేను.
ఇంటి సేవకు అంకితమైన
నిస్వార్ధ సేవా మూర్తిని నేను.

ఆదివారం కూడా
శలవు లేనిదాన్ని నేను.
వేళకు తప్పక వంటింట్లో
హాజరయ్యే పాకశాస్త్రనిపుణిరాలిని నేను.

  

నోట్లో నాలుక లేనిదాన్ని
ఎవరేమి చెప్పినా చేసుకుపోయేదాన్ని నేను.
ఎన్ని చట్టాలు వచ్చినా
ఏ చట్టానికి వర్తించని గృహధర్మాన్ని నేను.

ఏ చదువులు నేర్పని
అనుభవసారాన్ని నేను.
అందరి బతుకులు తీర్చిదిద్దే
లోక పరాయణురాలిని నేను.

  

నేను లోని అహాన్ని
తొలగించె ఔషధాన్ని నేను.
మనములోని ఔదార్యాన్ని పెంచె
చల్లని కుటుంబాన్ని నేను.

ముద్దు ముద్దు మాటలతో
అందరిని అలరించె చిన్నారిని నేను.
అందరి హృదయాలలో
పన్నీరు చిలికె చిన్నారి చెల్లెలిని నేను.

  

ప్రియునికి హితవు చెప్పె
ప్రేమ సూత్రాన్ని నేను.
వలచి చేపట్టిన వానికి
జీవితాంతం వెంట నడిచె ప్రియురాలిని నేను.

మంచి చెడులను తూచి
విలువకట్టె త్రాసును నేను.
పిల్లల మనసు తెలిసి
రంగరించి పోసె మాతృమూర్తిని నేను.

  

ఉదయ సంధ్యలో వెలిగే
సుప్రభాత గీతాన్ని నేను.
సాయం సంధ్యలో వెలిగే
అనుభవ తేజాన్ని నేను.

లోకానుభవంతో పెరిగిన
విద్వాంసురాలిని నేను.
లోకానికే అపురూపమైన
మహిళా రూపాన్ని నేను.

  

లోకంలో సుగంధాన్ని
వెదజల్లె తీపిమాటను నేను.
లోకంలో ఆనందాన్ని పంచె
చల్లని మనసును నేను.

మహాభారత యితిహాసములో
పంచ పాండవులకు పట్ట మహిషిని నేను.
దుశ్శాసనాదుల చేతుల్లో
వలువలు ఊడ్చబడిన అనాథను నేను.

  

ధర్మ శాస్త్రాలు వల్లె వేయని
ధర్మ సతిని నేను.
కురు సభలో ధర్మ సందేహాన్ని
లేకెత్తించిన సతి పాంచాలిని నేను.

దేహ బలము కన్న
మాట బలముగల ధీరురాలిని నేను
ధర్మము తప్పని యమధర్మరాజునకే
ధర్మ సంకటమైన సతీసావిత్రిని నేను.

  

భూమిలో పుట్టి భూమిలో కలిసిన
నోరు లేని సాధ్విని నేను.
భూమికే ఆదర్శమైన
సీతా మహాసాధ్విని నేను.

భోగ భాగ్యాలను ఆశింపక
పతివెంట అడవులకు నడచిన సతిని నేను.
పతి మాటకై అగ్నికే ఆహుతియై
అగ్నికన్న మిన్నయైన సీతాసతిని నేను.

  

వేదాలను ఆపోశనం పట్టిన
మహిళా తేజాన్ని నేను.
పండిత సభల్లో జేగంటలు మ్రోగించిన
మహిళా మణి గార్గిని నేను.

సర్వ శాస్త్రాలు నేర్చిన
పురాణ కాంతను నేను.
శాస్త్రవేత్తలతో తలపడి నిలిచిన
పాండితీ మూర్తి మైత్రేయిని నేను.

  

అన్యాయపు చీకటి ఎక్కడ వున్నా
ఆక్రమించె వెలుగురేఖను నేను.
న్యాయతేజాన్ని విరజిమ్మె
ఆత్మ బలాన్ని నేను.

నేల తల్లికి న్యాయం చేకూరేవరకు
పట్టువీడని సిపాయిని నేను.
ప్రాణమున్నంత వరకు స్వరాజ్యానికై
పోరాటం సలిపిన ఝాన్సీ లక్ష్మీబాయిని నేను.

  

ఆంధ్ర సామ్రాజ్య సంరక్షణకై
మగరూపం ధరించిన ఆంధ్రమహిళను నేను.
శత్రురాజులను గడగడలాడించిన
కాకతి రుద్రమదేవిని నేను.

పక్కదారులు పట్టిన తరాన్ని
మందలించె వీరనారిని నేను,
బాల్యక్రీడలలో మునిగిన బాలచంద్రుణ్ణి
వీర నాయకునిగ మార్చిన వీర మాంచాలను నేను.

  

దేశ సంరక్షణకై
మంత్రాంగాన్ని నడిపె యంత్రాంగాన్ని నేను.
పల్నాటి రాజులకు మంత్రిణిని యైన
నాయకురాలు నాగమ్మను నేను.

దేశ స్వాతంత్ర్య సమరానికి
కవిత నిచ్చిన కవయిత్రిని నేను.
దేశం నలుమూలల ఉద్యమ గీతం
ఆలపించిన ఉద్యమ కర్తను నేను.

  

ఖద్దరు మూటలు నెత్తిన పెట్టి
ఊరురా అమ్మిన సేవకురాలిని నేను.
గాంధీ ఆశయాన్ని నెరవేర్చిన
మహిళా జ్యోతిని నేను.

గానం వెంటే కవిత్వమని
మధుర కవితలల్లిన కవయిత్రిని నేను.
మహాత్ముని వెంటే ఉద్యమమని
ఉద్యమించిన సరోజినీనాయుడును నేను.

  

ఆడువారిని కూడగట్టుకొని
సత్యాగ్రహాలు నడిపించిన భారత మహిళను నేను.
మహాత్మునకు అర్ధాంగియై
దేశసేవకు అంకితమైన కస్తూరిబా గాంధీని నేను.

కాలు ముందుకు వేస్తే
వెనుకంజ తెలియని మహిళను నేను.
పరాయి పాలకులు తుపాకి యెత్తితే
గడగడ లాడించిన వందేమాతర గీతాన్ని నేను.

  

స్వరాజ్య సమరానికి సర్వం
అర్పించిన త్యాగమూర్తిని నేను.
స్వరాజ్య సముపార్జనకై
జైలుపాలైన దేశభక్తురాలిని నేను.

ప్రాణములకు తెగించి వీరపోరాటం
సాగించిన విప్లవనారీ మణిని నేను.
పరాయి పాలకులను
గడగడ లాడించిచ భారత నారిని నేను.

  

మారణ హోమమైన
సతిని రూపుమాపె సంఘ సంస్కారాన్ని నేను.
భర్త చితిపై బలవంతంగా తోయబడె
స్త్రీల పాలిటి రక్షక కవచాన్ని నేను

సమాజం చేతిలో ఆటబొమ్మలైన
ఆడువారికి ఆశ్రయాన్ని నేను.
అబలలైన అనాధలకు
శరణాలయాన్ని నేను.

  

అండ దండలు లేని అబలలకు
ఊతనిచ్చే చేతి దండను నేను.
అశం శుభం తెలియని ఆడువారికి
అభయమిచ్చే వృత్తివిద్యను నేను.

మహిళా సభలు పెట్టిన
మహిళా సేవకురాలిని నేను.
మహిళోన్నతి సాధించిన
మహిళామణి దుర్గాబాయమ్మను నేను.

  

ఆది కావ్యమైన రామకథను
తెలుగు ప్రబంధముగ తీర్చిదిద్దిన కవయిత్రిని నేను.
తెలుగు సాహిత్యానికే
కుసుమ రాజమైన మొల్లరామాయణమును నేను.

గానకళలో అందెవేసిన
హస్తాన్ని నేను.
గాన కళకే మణి కిరీటమైన
మధురగాన కోకిలను నేను.

  

నాట్య భంగిమలో అజంతా శిల్పమైన
మేటి కూచిపూడి నర్తకిని నేను.
నవరసాలు చిందించు
ఆంధ్రనాట్య కళాకోవిదురాలిని నేను.

ముచ్చటైన పట్టుచీర కట్టుటలో
ప్రపంచాన ఖ్యాతిగాంచిన వనితను నేను.
పసందైన నేత చీరకు కుచ్చిళ్ళు పెట్టుటలో
పేరు గాంచిన తెలుగు మహిళను నేను.

  

ఆవకాయరుచికి
అందెవేసిన హస్తాన్ని నేను.
గోంగూర పచ్చడితో
నోరూరించే తెలుగు వనితను నేను.

ఎన్ని భాషలు నేర్చినా
మాతృ భాషలో మధుర భాషిణిని నేను.
ఎన్ని పలుకులు పలికినా
తీయని తెలుగు నుడికారాన్ని నేను.

  

స్త్రీల చైతన్యానికి జీవితాన్ని
అంకితం చేసిన కార్యకర్తను నేను.
స్త్రీల పాలిటి వెలుగు రాణినైన
లక్ష్మీ రఘురామయ్యను నేను.

MANJEERA NADALU

By

Dr. VASA PRABHAVATI

## Other Writings

POETRY

1. *Alapana*
2. *Amma*
3. *Jagati - Pragati*
4. *Manavata Sikharam*
5. *Velugu Vachhe Vela*
6. *Snehasumalu*
7. *Katuka Kantineeru*
8. *Sangham Chesina Bikshuki (Natika)*
9. *Parivartana (One Act Plays)*
10. *Nyayam Guddidi (Stories)*
11. *Chaitanya Sravanthi (Essays on Ladies)*
12. *Russialo Snehayatra*
13. *Vendivelugulu (Novel)*
14. *Premabandham (Novel)*
15. *Kalatapasvi Ravoori (Life his tory)*
16. *Ragamalika (Light Songs)*
17. *Geetamalika (Light Songs)*
18. *Andhrasahityamlo Harichandropakhyanam (Thesis)*

Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyderabad-20